Regd. No. N. 45 / M 3813

వెల ఒక అణా

# ఆంధ్రపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౨ విక్రమసం॥ వైశాఖ శు॥ ౧౦ (౧౬-౫-౧౯౪౦ఫ.) గురువారము సంచిక ౪

# హాలెండు, బెల్జియం, లగ్జెంబర్గులలో ఘోర యుద్ధము

## హాలెండు లగ్జెంబర్గు రాణులు దేశము వీడుట

### జర్మను సేనల పురోగమనము

ఈ మేనెల ౧౦వ తేదీనుండి ౧౪వ తేదీవరకు వచ్చిన వార్తలవల్ల హాలెండు, బెల్జియం, లగ్జెంబర్గులలో యుద్ధము మహాఘోరముగా జరుగుచున్నట్లును. హాలెండు, బెల్జియములు మిత్రమండలి సేనల సాహాయ్యముతో ఎంత తీవ్రముగా ప్రతిఘటించుచున్నను, జర్మను సేనలిప్పటికి మూడు దేశములలోను కొన్ని ప్రదేశములను ఆక్రమించుకొనినట్లును, అందుపై అక్కడి దేశీయ సేనలు వెనుకకు దాటిపోయినట్లును తెలియుచున్నది.

హాలెండు, బెల్జియం లగ్జెంబర్గు దేశముల పై నికాధికారులు జర్మను సేనలు ముందుకువచ్చుటకు సౌకర్యములు లేకుండజేయవలచి రోడ్లను. నదుల పైగల వంతెనలను భగ్నముచేయుచుండిరి: విమానాలనుండి ఈ దేశములలో అన్ని భాగములయందును పారషూటుల (ఆకాశచ్ఛత్రముల) ద్వారా దిగుచుండిన జర్మను సేనలను వెంటవెంటనే మాతమార్చుచుండిరి. లగ్జెంబర్గుగుండా ఫ్రాన్సు సరిహద్దులమీదుగ వచ్చుచుండిన జర్మను సేనలు రైను నదికిని మ్యూజునదికిని మధ్య పెక్కుచోట్ల విడిసియుండగా బ్రిటిషువిమానములు ఆప్రదేశములపై బాంబులువేసినవి. జర్మను సేనలు రైనునదిమీదుగా హాలెండుసరిహద్దువద్దకు పోవుచుండినపుడు రైనునదిపై వేసల్ అనుచోటనున్న వంతెనపైను, ఆవంతెనవద్దకు చేరు బాటలమీదను, ఇంకను రైలుస్టేషనులమీదను బ్రిటిషు విమానములు బాంబులను వేసినవి. ఫ్రాన్సులోనికి జర్మనువిమానములుపోయి బాంబులువేసినందుకు ప్రతీకారముగా జర్మనుల విమానాశ్రయములమీదను, సైనిక కేంద్రములమీదను బ్రిటిషువిమానాలు బాంబులను వేయుటచే ౩౨ జర్మనువిమానములు ఫ్రాన్సులోను, బెల్జియంలోను క్రిందికి పడగొట్టబడెను. లగ్జెంబర్గుగుండా వచ్చుచుండినజర్మను సేనలలో ౪౦ లేక ౫౦ మోటారులారీల శ్రేణి సైనికులతోనిండియున్నది వచ్చుచుండగా ఆలారీలపై బ్రిటిషువిమానాలు బాంబులువేసెను బెల్జియంలో మే ౧౦వ తేదీని ౧౫ విమానాలును మే ౧౧వ తేదీనాడు ౪౦ విమానాలును, మే ౧౨వ తేదీనాడు ౧౦౦ విమానాలును జర్మనులని క్రిందకూల్చగొట్టబడెను.

ఈవిధముగా జర్మనులకు గొప్పనష్టము కలిగించుచుంటిమని, బ్రిటను, ఫ్రాన్సు, బెల్జియం, హాలెండులవారందరును ప్రకటించుచున్నారు. మే ౧౪వ తేదీవరకు సలిశా ౦ శ మే మధ్యగా మే ౧౦వ తేదీనాటి సాయంకాలము బెల్జియంలో మాస్ట్రిటుకు పడమట మాస్ అను నదిమీదను అల్బర్టుకాలువ అను పెద్దకాల్వమీదను ఉన్న బలమైనకోటలు జర్మనుసేనల వశమయ్యెను. మే ౧౧వ తేదీనాటికి మాస్ట్రిటు పట్టణము జర్మనులవశమయ్యెను. అంతవారు అల్బర్టుకాల్వదాటి తూర్పుగా ప్రయాణముసాగించిరి. బెల్జియం సేనలు మాస్ట్రిటు నుండి వెనుకకు మరలెను. కాని మాస్ట్రిటుకు పడమటిబెల్జియంసేనలకును జర్మనుసేనలకును జరిగిన యుద్ధములో జర్మనులు వెనుకకు మరలిరని ఒక ఫ్రెంచివార్త చెప్పుచున్నది. బెల్జియం ప్రధాని మే ౧౨వ తేదీసాయంకాలము తమప్రజలకు చెప్పిన మాటలలో బెల్జియంపరిహద్దులవద్దనున్న రెండు వంతెనలను జర్మనుసేనలుదాటి మాదువంతెనను చున్న జర్మను సేనలు అపారముగ కనబడుటచే బెల్జియంసేనలు టాంగ్రిసువరకు వెనుకకు మరలినట్లును సాయంకాలము బెల్జియంసేనలు విమానాలతో వచ్చి జర్మను సేనలను నిరోధించగలిగినట్లును తెల్పిరి. అల్బర్టుకాల్వకు తూర్పువైపునను, ఉత్తరమువైపునను జర్మను సేనలకు బెల్జియంసేనలు అడ్డునిల్చినవి. మ్యూజునదివద్ద అనేక ప్రాంతాలలో కుడివైపుఒడ్డున లగ్జెంబర్గు పరగణాలో జర్మను సేనలతాకుడుఆగలేక బెల్జియంసేనలు వెనుకకుమరలినవి, ౧౪వ తేదీనాటికి తూరుపోటలలో ఒకటిలాంగను. బెల్జియంసేనలతోపాటు ఫ్రెంచివారును వెనుకకుమరలసాగిరి.

ఇక హాలెండుసమాచారము మే ౧౧వ తేదీనాటికి జర్మనుసేనలు హాలెండు సరిహద్దులనుదాటి ౧౫మైళ్ళలోపలికి చొచ్చుకొనిపోయియుండిరి. ౧౨వ తేదీనాటికిలగ్జెంబర్గును,అప్పెండిన్సుపట్టుకొనిరి. ౧౪వ తేదీనాటికి జర్మనులు పడమటిదిశగా, ఆరణ్హీమ్ వైపుపోవుచుండిరి. హాలెండు ఉత్తరంలో జర్మనులు తూర్పుసముద్రమువంకకు జాండర్జినదివరకు వెళ్ళిరి.

ఇక లగ్జెంబర్గు. ఇక్కడకూడా కొంతభాగము జర్మనీవారలవశమైనది.

మే ౧౧వ తేదీఉదయము ఫ్రాన్సుసేనలు బెల్జియంసరిహద్దులనుదాటి హాలెండు ప్రవేశించెను. బ్రిటిషు సేనలుకూడ ప్రవేశించెను. అంతే.

హేగునగరములోను, బ్రసెల్సునగరములోను జర్మనుసైనికులు పారషూటులనుండిదిగి పోరాటములు చేయుచున్నారు. జర్మనులు హాలెండు రాణిని పట్టుకొనుటకై ముట్టడివేయబోవుచుండగా హాలెండుప్రభుత్వమువారు, రాణిగారిని ఒక ఓడలో ఇంగ్లాండుపంపిరి. ఆమె మే ౧౩వ తేదీనాడు లండనుస్టేషనులోదిగగా బ్రిటిషురాజుగారు ఆమె కరస్పర్శముచేసి రెండు బుగ్గలను ముద్దాడి తమ బకింగుహాంసౌధమునకుగొంపోయిరి. లగ్జెంబర్గురాణిగారు భర్తతోను బిడ్డలతోను మే ౧౦వ తేదీనాటిరాత్రి ఫ్రాన్సులోఒక హోటలులోమారువేషమున దిగెను.

మొత్తముమీద ఇంతవరకు జర్మనీదే విజయముగా కనబడుచున్నది.

## హాలెండువారి కాలనీలు

హాలెండువారి వెస్టుఇండీస్ అను కాలనీలలో మే ౧౧వ తేదీనాడు బ్రిటిషుసేనలు దిగినవి. ఇక ఈస్టిండీస్ విషయంలో జపాను బ్రిటిషు రాజకీయ ప్రతినిధి జపాను విదేశాంగమంత్రితో మే ౧౧వ తేదీనాడు సంభాషించుచు ఇప్పుడు ఈస్టిండీసులోనున్న హాలెండుసేనలు ఆదీవుల రక్షణకు చాలునవనియు, బ్రిటిషువారు ఆదీవులలో శాంతిక్యము కలుగజేసికొనరనియు చెప్పిరి.

## ఇటలీవైఖరియేమి?

ఇటలీ ప్రధాన నగరమగు రోంలో బ్రిటను పట్ల ద్వేషముప్రబలుచున్నది అట్టి ద్వేషరచనలుగల పోస్టర్లు గోడపై అంటించబడుచున్నవి. బ్రిటను ఫ్రాన్సులు సముద్రముగుండు నౌకలన్నిటితోపాటు ఇటలీనౌకలనుకూడ తనిఖీచేయుచుండుట ఇటలీకి కంటకముగానున్నది.

మే ౧౨వ తేదీనాడు ముసోలిని గారు సైనికాధికారి మార్షల్ గ్రాజియాని గారితోను మరికొందరితోను కొన్నిగంటలు సంభాషించి పశ్చిమసరిహద్దులలోరక్షణఏర్పాట్లుచేయు బాధ్యతనుజనరల్ పింటూరగారికిచ్చిరి. మరికొన్నితరగతులను సైనిక కార్యములలోచేయుటకు ఉత్తరువుచేసిరి.

## నార్వేయుద్ధము

నార్వేలో నార్విక్కులో బ్రిటిషునౌకాదళముపై జర్మనువిమానాలు దాడిసలిపెను. నార్వేతీరములో బెర్గెనురేవుకు దక్షిణమునుండి ఉత్తరముగా నామ్సోసువరకుసముద్రములో మందుగనులు వేయబడునని బ్రిటిషునౌకాధికారులు ప్రకటించినారు. బెర్గెనుపై బ్రిటిషువిమానాలుదాడి సెను

### హాంగరీ జర్మనీ సరిహద్దులమూత

జర్మనీ హాంగరీలమధ్య హాంగరీసరిహద్దుమూయబడినది.

## రుమేనియా ప్రభుత్వం మార్పు

రుమేనియాలో ప్రాతమంత్రివర్గము రాజీనామానిచ్చి, తిరిగి అదేప్రధాని టటారెస్కూగారి క్రిందనే క్రొత్తమంత్రివర్గము అన్నిపక్షాల ప్రతినిధులుగలది ఏర్పడినది. ఈమంత్రివర్గము తటస్థముగనుండునని ప్రకటనచేయబడినది. రుమేనియాలో పెట్రోలుకంపెనీలు అమెరికా, బ్రిటిషుకంపెనీలగుటచే అవి రుమేనియానుండి చమురును జర్మనీకి పోనిచ్చుటలేదు.

## చైనా జపానులయుద్ధము

చీనాసైన్యము ౫౦౦వేల జపానుసైన్యమును పరిమార్చి గొప్పవిజయముబడసినది. ఏడు జపాను డివిజనులు హాంకో నాయకత్వమున సియాంగుకు తూర్పున మైదానములపైపోవుచు చీనావారి వలలోచిక్కిరి. చీనావారు చాలస్థలములను పునరాక్రమించిరి.

## ప్రధానమంత్రి చర్చిల్‌గారి ఉపన్యాసము

### మన నియమము? యుద్ధముచేయుట

### మన యుద్దేశ్యము? యుద్ధముగెలుచుట

యుద్ధంలో బ్రిటను గెలువకుంటే సామ్రాజ్యం పోతుంది

### బ్రిటిషు మంత్రివర్గము

ఛేంబర్లేను గారురాజీనామానిచ్చినతర్వాత చర్చిల్ గారు ప్రధానమంత్రిత్వమును స్వీకరించిరనిఇదివరలో వినియుంటిరి. ఇపుడుచర్చిలు గారు తమ మంత్రివర్గమునుఏర్పాటుచేసికొన్నారు. అందులో యుద్ధమంత్రివర్గమందు అయిదుగురు మాత్రముగలరు. చర్చిల్ గారు ప్రధానమంత్రిగానుండి దేశరక్షణశాఖను చూచుకొందురు. వీరుగాక నెవిల్ ఛేంబర్లేను. సి.ఆర్. అట్లీ, ఆర్థర్ గ్రీన్‌వుడ్, లార్డ్ హాలిఫాక్సు గారలున్నారు. ఇందులో హాలిఫాక్సుగారు ఛేంబర్లేనుగారితో పాటే పోవున్నారు. అట్లీగారును, గ్రీన్‌వుడ్ గారును, లేబర్ పార్టీ నాయక, ఉపనాయకులు. వీరు ఇదివరకు మంత్రివర్గములోలేకుండ ప్రతికూలపక్షములోనుండిరి. వీరినిచేర్చుకొనుటకలన ప్రతికూలపక్షమునుకూడ గలుపుకొనినట్లయినది.

ఇక యుద్ధమంత్రివర్గముగాక తక్కినమంత్రులు ఏ. వి. అలెగ్జాండర్, ఆంథోనీ ఈడన్, సర్ ఆర్చిబాల్డ్ సింక్లేర్, సర్ జాన్ సైమన్, లార్డ్ లాయిడ్, సర్ కింగ్స్‌లీ వుడ్, సర్ జాన్ ఆండర్సన్, సర్ హెర్బర్టుమారిసన్, డఫ్‌కూపర్, సర్ ఆండ్రూడంకన్, యల్. యస్. అమెరీ, మాల్కం మాక్డొనాల్డ్, ఎర్నెస్టుబెవాన్, లార్డ్ ఫుల్టన్ ఇందులో యల్. యస్. అమెరీగారు భారతదేశమునకును.బర్మాకును సెక్రెటరీఆఫ్‌స్టేటుగా నుందురు.

మే ౧౩వ తేదీనాడు చర్చిల్ గారు తమ మంత్రివర్గమునందు పార్లమెంటువారు విశ్వాసముప్రకటించవలెనని కోరిరి. ఆదేప్రకారము విశ్వాసతీర్మానము అత్యధికసంఖ్య ఓట్లతో గెలిచెను. తీర్మానముపై ఉపన్యసించుచు చర్చిల్ గారు ప్రసిద్ధయుద్ధములలో గొప్పవాటిలో నిదియొకటియనియు, ఇదియింకను ప్రారంభమందేయున్నదనియు చెప్పిరి. మంత్రివర్గములో స్థానాలు దొరకనివారలనుగురించి చెప్పుచు, "శ్రమ క్రుకణములు, చెమటతప్ప మరేదియు ఇచ్చుటకు నావద్దలేవు" అని చెప్పిరి.

ఇపుడు బ్రిటిషువిధానముగురించి చెప్పుచు చర్చిల్ గారు "మహాఘోరమైన పరీక్ష మనలను ఎదుర్కొనవలసివచ్చినది. ఇంకను ఎన్నియోదీర్ఘ మాసములు మనము బాధల ననుభవింపవలసియున్నది. మనవిధానమేమనగా, యుద్ధము చేయుటయే. భూమిమీదను సముద్రమార్గమునను, విమానమార్గమునను యుద్ధముచేయుటయే మన విధానము. దీనికి భగవంతుడు మనకిచ్చిన శక్తినంతయు వినియోగించవలసియున్నది. మనలక్ష్యమేమను ప్రశ్నకు ఒకటేజవాబు. అదియేమనగా, సర్వవిధముల జయము ఎన్నికష్టాలుకలిగినను జయము......జయము లేనిచో బ్రతుకేలేదు. బ్రిటిషుసామ్రాజ్యము నిలువజాలదు. బ్రిటిషుసామ్రాజ్యము దేనికైఉన్నదో అది నిలువజాలదు. మానవులు తమ గమ్యస్థానము చేరవలెనను ప్రేరణ నిలువజాలదు."

చర్చిల్ గారు ప్రవేశపెట్టిన తీర్మానమువంటిదే లార్డ్సుసభలోకూడ అవాడే ఆమోదించబడినది.

## ఆంధ్ర కమర్షియల్ సిండికేటు

### ఉపన్యాసములు

శ్రీ ఆంధ్రా కమర్షల్ సిండికేటువారి యాజమాన్యమున ప్రొఫెసర్ వి. రామారావు, బి. కామ్ గారు డి. కామ్ డిగ్రీ పొందుటకు తగిన ఉపన్యాసములు యిచ్చుటకు సికింద్రాబాదు వచ్చియున్నారు. వీరు కింగ్సువేలోనున్న "జ్యాకెయిడ్ బిల్డింగు"లో ౧౫మేయి మొదలు నెలరోజులు ఉపన్యాసములు యిచ్చెదరు. ఈ సిండికేటువారిఉద్దేశ్యము "బీ-కాం సంఘము" తయారుచేయుట కాదు. వాణిజ్యములలో స్వతంత్రప్రముఖులుగా ఆంధ్రులనుచేయుటయే దీనిముఖ్యోద్దేశము- పురజనులు యిటువంటి అవకాశమును పోగొట్టుకొనవలదని మేము హెచ్చరించుచున్నాము- ఇతర విషయములలో ఆంధ్రులు వెరిసలపోను పొందెదరు గాక-

# నిజాము రాష్ట్రమునందలి జైనాలయములు

(శేషాద్రి రమణకవులు)

రాయలసీమ యందలి జైనాలయములను గూర్చి వ్యాసము వ్రాసినపిదప నిజాము రాష్ట్రమునందలి జైనాలయములతో నాంధ్రులకు బరిచయము గలిగింపదలంచి ఈ వ్యాసము వ్రాయుచుంటిమి. నిజాము రాష్ట్రమునందలి కొలనుపాక సుప్రసిద్ధ జైనక్షేత్రము. రేణుకాచార్యుల జన్మభూమియగుటచే వీరశైవులకుగూడ నిది పవిత్రక్షేత్రము. శైవసంఘట్టనముకతన నిచట జైనాలయములు చాలవరకు భిన్నభిన్నములయ్యెను.

ఇచటి జైనాలయము సుప్రసిద్ధము. జైనపురాణములలో నిచటి జైనవిగ్రహము ప్రశస్తి చెప్పబడినది. అంతియగాదు తొలుత దేవతలు పిదప రావణుడు మండోదరి ఈ జైనవిగ్రహమును బూజించినట్లు గలదు. మరకతశిలపైనున్న ఇచటి జైనమూర్తి మనోహరముగానున్నది. అద్భుతముగ శిల్పకళలతో నేటికిని చెక్కుచెదరక యున్నది. ఈయాలయమును జైనులు పునరుద్ధరించి అందందు జేరియున్న విగ్రహముల నిందుజేర్చి పూజారోగ్యములు గావించిరి. కొలనుపాకలోని వీరనారాయణాలయము ఒకప్పుడు జైనాలయమే, ఇందుగల జైనవిగ్రహములదీసి విష్ణువిగ్రహముల మధ్యకాలమున జేర్చిరి. ఐనను ఆలయనిర్మాణపద్ధతి గర్భాలయములోని నాగరలిపిశాసనము ఇది జైనాలయమనుటకు ప్రబలసాక్ష్యముగ నున్నది. ఈ క్షేత్రము జైనులకు పవిత్రభూమి, జైరానుపల్లి- ఇదిచిన్నపల్లె. గ్రామము బైట నొక జైనాలయముగలదు. మల్లారెడ్డియను నాతడు పదియవ శతాబ్దమున గొన్ని వృత్తులనొసంగెను. ఆలయమున చెక్కుచెదరని జైనవిగ్రహములు మూడుగలవు. రెండుకూర్చుండియు నొకటినిల్చియున్నవి, ఆలయము శిథిలమగుటచే నీవిగ్రహములు మంటిలో పూడుకొని పోవుచున్నవి. ఇందు వైదికమతమువారట్టి ప్రవేశము గావింపనందున విగ్రహములు మార్పబడలేదు. ఇందలి విగ్రహములు ప్రత్యేకదర్శనీయములు. ఇచటి శాసనము వైదికములోని రెడ్డి యీ క్షేత్రము నాదరించుట గనుపింపదగునంశము,

వేములవాడ—ఇది ప్రసిద్ధ క్షేత్రము. ఇచటి రాజేశ్వరాలయము తొలుత జైనాలయము. ఇందలి నేమినాథవిగ్రహములు జైనమూర్తులు నేటికిని అంతర్భాగమునందు యథాస్థానమునందె యుంచబడినవి, ఈ గ్రామమునందును తటాకమునకు నాంపల్లిగుట్టపైనను జైనచిహ్నములు పెక్కుగలవు. పదియవశతాబ్దమున రాజరాజాఖ్యుడను పేర నొక లింగము నెలకొల్పి దీనిని శివాలయముగా మార్చెను- పవిత్రమగు నీ జైనక్షేత్రము పూర్తిగ నిప్పుడు వైదికమతమువారి స్వాధీనములో నున్నది,

నగునూరు- ఇచటి శివాలయములు వీరవిగ్రహములు జైనవిగ్రహములు పెక్కులుగలవు-కాకతి ప్రోలరాజు కాలమున నగరరక్షకుడుగను నుండటి రుద్రదేవుని కాలమున మంత్రిగనున్న గంగాధరుడిచట గొప్ప జైనాలయము నిర్మించెను. జినోహరియనిగూడ తన జైనదేవుని శాసనమునందు ప్రశంసించెను. నగునూరులో నతడు నెలకొల్పిన శైవవైష్ణవాలయము పెక్కుగలవు- అందు ప్రత్యేకగణనీయము జైనాలయము- ఈ ఆలయములోని విగ్రహములు కీర్తులందన్నిటియందు చెదరియున్నవి. వీనినాదరించు దిక్కులేదు.

హనుమకొండ- ఇదియొక జైనాశ్రమము. కొండశిఖరమునందును పరిసరములందును జైనమూర్తులు చెక్కనారు. పద్మాక్షిగుడి చెంతగల గండశిలలపయి చెక్కబడిన జైనమూర్తులు మనోహరతములు. పద్మాక్షియాలయములో గండశిలపై చెక్కబడిన మాణిభద్రుడు పార్శ్వనాథుడు పద్మాక్షి విగ్రహములలో నంతగా శిల్పకళలేదు- ఇంకను నీశిలలపై చెక్కుట మొదలుపెట్టిన విగ్రహము లేటికో అసంపూర్ణముగా ఆగిపోయినవి. యీ యాలయము తీర్థంకరాదులతో గూడిన రెండు జైనులవిగ్రహములు గోపుర శిఖరములపై చేర్పదగిన శిలాఫలకము జైన మూర్తులతో నలరారుచున్నవి. మతవిప్లవములలో భిన్నభిన్నముగావింపబడిన విగ్రహభాగము లాకచేనిలో దిక్కులేక పడియున్నవి. ఓరుగల్లులో రెండును, హనుమకొండలో రెండు జైనశాసనములు లభించినవి, ఓరుగల్లుకోటలోని చితాపుఖాను మందిరమున అత్యంత మనోజ్ఞములు జైనమూర్తులు భూగర్భమునుండి వెలువడ దొరతనమువారు భద్రము చేసినారు, అవి పదియవ శతాబ్దమునాటివనుటకు క్రిందగల వ్రాత సాక్ష్యమిచ్చును. హనుమకొండలో సిద్ధేశ్వరాలయము తొలుత జైనాలయమనుటకు ద్వారముపైగల జైనమూర్తులు సాక్ష్యము నొసగును, కాకతీయులలో బూర్వులెవరును జైనులైరనుటకు దగిన యాధారము లింతవరకు గనిపింపలేదు. కాకతి ప్రథమ ప్రోలరాజు నాటిదగు హనుమకొండ సురేశ్వరాచార్యుని శాసనములో తాను శ్వేతాంబరులును రక్తాంబరులును వగు జైనులను నాశనము గావించితినని చెప్పుకొనినాడు. కాకతీయుల యుద్యోగవర్గములోనే జైనులు విశేషించి గలరు. జోగిపేట ఇచటను ఆంధ్రులగు జైనులుగలరు. వీరిలో బ్రాహ్మణాదులగు నాలుగు జాతులవారలు గలరు. పూజాధికముల జరుపువారిని బ్రాహ్మణులనియు వర్తకము జేయువారల వైశ్యులనియు, గర్షకులను శూద్రులనియు. వ్యవహరింతురు. క్షత్రియజైనులు మధ్యకాలమున నంతరించిరి. వీరిలో వీరికి సహపంక్తిభోజనములు పరిస్థితులు బాగున్నచో ఇచ్చిపుచ్చుకొనుట సైతము గలదు. మెదకుమండలములో నింకగొన్ని తావులగల ఆంధ్రజైనులతో వీరి సంబంధ బాంధవ్యములు నడచుచున్నవి

పూర్వకాలమున నిచట పెక్కు జైనాలయములుగలవు, వైదికమతమువారి దౌర్జన్యముచే పెక్కు దేవాలయములు రూపుమాపబడినవి. ఇచట చేరువలోనున్న అల్లాదుర్గము గొప్ప జైనక్షేత్రము. మతవిప్లవములలో నిచటి దేవాలయములు శివాలయములు శక్త్యాలయములుగా మార్పునొందిన జైనచిహ్నములు మొదలంటు నశింపజేయలేదు. నేలత్రవ్వగనే వివిధములగు జైన విగ్రహము లిచట వెలువడుచున్నవి. స్థానికుడగు నొక కళాభిమాని బయలువెడలిన జైనవిగ్రహముల దుర్వినియోగముగానీక తనయారామమున జాగ్రత్త చేయించుచున్నాడు. ఇక జోగిపేట సంగతి. జోగిపేటలో వందలకొలది జైనవిగ్రహము లుండెడివి. ఇప్పుడు నశించినశించి పదియొనిమిదిలోనికి వచ్చినవి రాజ్యవిప్లవదినములలో లోహరూపములు శిలారూపములునగు వివిధాకృతులందున్న జైన మూర్తులను తమగృహములకు మధ్యనున్న ఒక విశాల మందిరమునజేర్చి యాజినాలయమని బహిరంగముగ జైనులు పూజా పునస్కారములు జరుపుచున్నారు. ఇచటి జైనసోదరులు మాకు ఆలయమును పూజావిధానమును జూపించిరి. లోహవిగ్రహములపయి నిర్మాతల నామములుగలవు. సావకాశముగా బరిశీలింపదగినవి ఏలయన నిత్యముతోముటచే వ్రాత చాలవరకు అరిగినది. ఇన్ని జైనవిగ్రహములు పూజాయోగ్యముగా సురక్షితముగా ఆంధ్రుల యవలంబనంబుననున్నవి లేవనియే చెప్పవొప్పును. జోగిపేట జైనాలయమునందు దాదాపు రెండుమూడు అడుగుల యెత్తుగల నల్లరాతి చెక్కిన ఆదినాథ, పార్శ్వనాథ, తీర్థంకర, సరస్వతి, మాణిభద్రవిగ్రహములు రెండువరుసల నిండగలవు పద్మాక్షివిగ్రహము ఇందు మనోహరతమము, నిల్చినట్లున్న ఒక అడుగుపావుగల తీర్థంకరుని స్ఫటిక విగ్రహము ప్రత్యేకదర్శనీయము. ఇత్తడి జైనవిగ్రహములు పదునొకండుగలవు. ఇందు గొన్నింటిపైని, నిర్మాతల నామములుగలవు. 3½ అడుగుల యెత్తుగల జైనవిగ్రహమొకటి కలదుగాని కొంచెము పగిలిపోయినది, 1½ అడుగుల యెత్తుగల తీర్థంకరసహిత జైనవిగ్రహము రమణీయతరము. ఇదివల్లజాతిపయి చెక్కబడినవి. ౧౨ జైనవిగ్రహములు ఇత్తడివి ౨ దేవీవిగ్రహములు సర్పాతపత్రముగలవి సైతముగలవు, ఈవిగ్రహరాజము జైనకుటుంబములు నశించుకొలది యాలయమున చేర్పబడుచువచ్చినది. ఇచటి జైనులు సహజముగా బీదవారు. అట్లయ్యు ఒక జైనబ్రాహ్మణుని పూజారిగానుంచి పూజాదికములు యథాక్రమముగా నెరవేర్పించుచున్నారు. వైదికమతములవారి దౌష్ట్యములవలన నిబ్బందులు కలుగుచుండుటచే జైనులు తమవిగ్రహములు, లిఖితగ్రంథములు ఇతరులకు జూపరొల్లరు. సమీపగ్రామములలో నింక నైదారింట నిట్టి జైనమందిరములుగలవు. సాదరముగా మాకీయాలయమును గ్రంథనిలయమును ఇచటి జైనప్రముఖులు జూపి తమయిబ్బందులుగూడ మాకెరిగించిరి.

పటంచెరువు. ఇచట జైనాలయములు వందలకొలదిగలవు. బసవేశ్వరుని కాలమున నిచటి జైనాలయములు పూర్తిగ రూపుమాపబడినవి. బసవపురాణమువలన నిచటి జైనమతవిజృంభణము శైవుల సాహసకార్యములు చాలవరకు దెలియవచ్చును. ఇచట జైనవిగ్రహములు అసంఖ్యాకముగా గలవు. అందుగొన్నింటిని హైద్రాబాదు వస్తుప్రదర్శనశాలలో చేర్చినారు. పొన్నగంటి తెలగన్న యయాతిచరిత్రములో పటంచెరువును పేర్కొనినాడు. జైనులశిథిలముల చెక్కింట నిచట జూచి వైదికమతమువారి విజృంభణమును స్మరణమునకు దెచ్చుకొనవచ్చును. ప్రాచీనాలయములు బాగుగా పరిశోధించినచో తొలుతనివి జైన మందిరములనుటకు దగినన్ని ఆధారములందే గోచరించును. ఇట్టిపరిణామము నీరాజ్యమునందు పెక్కుచోటులందు గానవచ్చును. ఐనను జైనులజాతీయత దేశీయులహృదయములను విశేషించి యాకర్షించుట యొకవిశేషము.

# గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర వైశాఖ శు॥ ౧౦

గురువారము


## జాగీర్దారులసభ

అందరును మేలుకొన్నారు. జాగీర్దారులుకూడా మేల్కొన్నారు. ఇంక నిద్రపోయ్యేవా రెవరైనా ఉన్నారా అంటే ఉన్నారు. "మా జాగీరుప్రజలు! హైదరాబాదులో న్ని ప్రాంతాలకన్న వెనుకబడిన స్థలాలు ఉన్నవా అంటే అవి జాగీర్లు. లెక్కలేనన్ని పన్నులు, అక్రమమైన పన్నులు క్కడనైనా ఉన్నవా అంటే అవి జాగీరులు. విద్యాశూన్యత యెక్కడన మూర్ఖత్వ అంటే అవి జాగీరులు. మూఢులెక్కడనైనా విశేషంగా ఉన్నారా అంటే వారు జాగీరుప్రజలు. ఇతరసౌకర్యాలు చాలతక్కువగా ఉండే స్థలాలెక్కడనండీ అంటే మరల అవి జాగీరులే అనపలసివచ్చినది.

ఈ లెక్క ప్రకారము చూస్తే జాగీర్దారులకు సాధారణంగా ఆదాయ మెక్కువ ఖర్చు తక్కువ. అనగా వారు లాభంలోనే ఉన్నారు. ఎవరైనా వెనుకబడినవారుగా ఉంటే వారు సంఘముగా ఏర్పడి ఒకరి కొకరి బుద్ధిచెప్పుకొని మన లోపాలను ఇక ముందునుంచి యైనా తొలగించుకొందము అని సభలు ఏర్పాటుచేసి తీర్మానాలుచేసి కార్యక్రమమును నడిపించుట సహజము. మరి జాగీర్దారుల కేమి యిబ్బందులు కలిగినవి. ఏమిలోపాలున్నవి? వారికి సంఘమెందుకు? అంటే వారికిని చీమకుట్టినట్లుగా ఇప్పుడిప్పుడు కొద్దిగా ఒత్తిడి కలిగిన దనుకొనుచున్నారు. రైతులు చాటుచాటుగా పత్రికలలో తమ యిబ్బందులను తెలుపుకొబట్టినారు. మరి వారిసంస్థానాలలో అన్ని సౌకర్యాలు ఖాల్సాలో కలిగించినట్లుగా చేసినట్లైతే వారిఆదాయములో చాలాపడిపోతుంది. పడిపోతే వారిఅంగరంగ భోగాలకు, వారి మోటారుసవారీలకు, వారి నగరములోని విలాసాలకు హార్ధి వినోదాలకు కొద్దిగా ఇబ్బందికలుగుతుంది. అని ఒక ఆలోచన ఉండవచ్చును. అయితే యీ ఊహ సరికాకపోవచ్చును. జాగీర్దారులసభయైు వారి తీర్మానాలు మనము చూచిన తర్వాత వారి యుద్దేశమును గురించి యించుమించు సరియగు అంచనా వేయవచ్చును.

అయితే జాగీర్దారుల ఉద్దేశము ఒకటి ప్రధానంగా ఉన్నదని మనము చెప్పవచ్చును- కొన్ని మాసాలక్రిందట కొందరు జాగీర్దార్లుసంఘీభవించియేర్పాటుచేసుకొన్న జాగీర్దారుల సంఘములో వారొక తీర్మానము చేసియుండిరి. అదే మన పూర్వము ప్రభువులు యీజాగీర్దారుల పూర్వీకులకు జాగీర్లు యిచ్చినారంటే అవి కేవలము వారి కుటుంబపోషణకై యిచ్చినారని తీర్మానించుకొన్నారు. దీనిపైన వ్యాఖ్యానముచేస్తే యేమి తేలుతుందంటే — జాగీర్దారులు తమ తమ జాగీర్లలో ఇష్టమువచ్చినట్లు పన్నులు వేయవచ్చును. ఆపన్నును యావత్తు తమ కుటుంబపోషణకు మాత్రమే వినియోగించుకొనవలెను. రైతులపై ఒక దమ్మిడీకూడ ఖర్చుపెట్టరు. అట్లు ఖర్చుపెట్టండయ్యా అని అడుగుటకు యెవ్వరికిన్నీ అధికారములేదు. రైతుల యొక్కవిద్య? —— అది మాకు తెలియదు- ప్రజలఆరోగ్యము?——అదివారే కాపాడుకోవలెను, రోడ్లు?——మామోటారుల హద్దువరకే! లోకల్ఫండు? —— వసూలుచేస్తాము. అందుకువిరుద్ధముగా ఏమిచేసిన్న మాసనదులలో లేనేలేదు! మరమ్మతులు?-మాబంగ్లాలకుచేస్తున్నాముగా? అని చెప్పేధోరణిలోనున్నట్లున్నది. జాగీర్దారుల యీలక్షణాలను గమనించియే మొన్నటి ఆంధ్రమహాసభలో ఈ క్రింది తీర్మానము గావింపబడెను.

"రాజ్యములోని మూడవ భాగమున నివసించుచున్న జాగీర్దు ప్రజల ఆర్థిక విద్యాదుస్థితికి ఈ మహాసభ వారు చింతిల్లుచు ఇటీవల జాగీరుదారుల సంఘమువారు తమ పౌరులకు విద్యాభివృద్ధి ఆరోగ్యజీవనము సుఖసాధనములను సమకూర్చు బాధ్యత తమపై లేదనియు జాగీర్ల ఆదాయము కేవలము తమ కుటుంబపోషణకొరకే ఉద్దేశించబడినదనియు తీర్మానించిన విషయమును ప్రభుత్వము నెదుటబెట్టుచు ఈ మహాసభ వారు జాగీరుప్రజల నిస్సహాయతను తొలగించుటకై మాల్కి,పోలీసు, అదాలతు అధికారములు జాగీరుదారులకు లేకుండ చేయుచు తగిన జాగీరు పరిపాలనా శాసనమును గావించి జాగీర్దార్లయొక్కయు, వారి పౌరులయొక్కయు, బాధ్యతలను హక్కులను స్పష్టపరచి ప్రజలహక్కులను కాపాడవలయునని ఈ మహాసభ వారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు." పై తీర్మానముపై జరిగిన చర్చలను గూడ బాగుగా గమనించినచో జాగీర్లలో రైతులకు చాలాయిబ్బందులు కష్టాలు ఉన్నవని స్పష్టమగుచున్నది.

కాని జాగీర్దారులుకూడ మహాసభ చేయుచున్నారంటే అదే ఆశ్చర్యము. వారు తమ ఆదాయము నంతయు తమకే వినియోగించు కొనదలచినచో అది పొసగనేరదు. ఈ రాష్ట్రములో దీవానీ ప్రభుత్వ మొక్కటే సర్వాధికారిగా నుండవలసినది. ప్రతిపేరైన జాగీర్దారుకూడా పోలీసు, న్యాయాధికారాలు మాల్ అధికారాలు, నహించితే రాష్ట్రములో లెక్కలేనన్ని ప్రభుత్వాలుండును. బ్రిటిషిండియాలో మనగొప్ప గొప్ప జాగీర్దారులకన్న సంస్థానాధీశులకన్న, హాయిగానవాబులకన్న మించిన ఆదాయము (కొన్నిచోట్ల మూడంతలు నాల్గంతల ఆదాయము) కల బొబ్బిలి, పిఠాపురము; నూజివీడు మున్నగు పెద్ద పెద్ద జమీందారీలలో పోలీసు, న్యాయాధికారాలుగాని తుదకు రెవెన్యూవిచారణాధికారాలుకాని లేవుకదా? మరిఅక్కడిజమీందారాల దర్జాకు లోటువచ్చినదేమికలదు? మన జాగీర్దారులకును అట్లే వర్తించునట్లుచేయవలెను.

## నెహ్రూపై విమర్శ యేమిటి? బిదంతో సానుభూతిచూపరా?

### యం. నరసింగరావుగారి జవాబు

౭ తేదినాటి 'సుభేదక్కన్' స్థానికఉర్దూ పత్రికలో పండిత మండుముల నరసింగరావుగారు కొన్నిదినాలకుముందు కలీముద్దీన్ అన్సారీ అనువారు వారిపై వేసిన సవాలుకు జవాబుగా ఇట్లు పత్రికా ప్రతినిధితో చెప్పినాడని ప్రకటించినారు.

"నేను నాస్నేహితుడగు కలీముద్దీన్ అన్సారీగారి అభిప్రాయాన్ని గౌరవపూర్వకముగా చదివినారు. వారు పండిత్ జవాహర్లాలు నెహ్రూగారి ప్రకటనను ఖండించుచు వ్రాసియున్నారు, అందువారు నన్ను పేర్కొని యిట్లు వ్రాసియున్నారు- పండిత నెహ్రూ అభిప్రాయములను ఖండించునట్టి అభిప్రాయములను నరసింగరావుగారు మరల నొకమారు బహిరంగముగా ప్రకటించునంతటి నైతిక ధైర్యము గలిగియున్నారా లేదా? ఈసూచన బాహిరంగముగాలేదే. అంతరంగికముగా జరిగిన ఒక సమావేశ చర్చయైయున్నది- బాహిరంగముగాను చర్చల బయట పెట్టుట యెంతవరకు సమంజసమో నాకు తెలియదు- పండిత నెహ్రూ అభిప్రాయాన్ని ఖండించుటకు పూర్తి బాధ్యత స్థానికులపైవేసి మరల ఇట్లని వ్రాసినారు- "స్థానికులు పండితనెహ్రూ యొక్క అబద్ధాభిప్రాయముల నేల ఖండిచలేదు- ఇట్టి సందర్భములో వీరికి దేశద్రోహులని అంటే వీరికెందుకు మంటలెత్తును-"

దేశద్రోహులంటే యితరులకు మండుక వచ్చునో లేదోకాని నాకుమాత్రము తప్పకుండా మంటలెత్తును- ఎందుకంటే నేనీదేశంవాన్ని నా పూర్వికులిక్కడివారే నేనిక్కడనే చనిపోవువాడను- కావున దేశభక్తి నాకు ముఖ్యమైనది- నేను దేశాన్ని అమ్ముకునేవాన్నికాను. దేశాన్ని అమ్ముకునేవాడే దేశద్రోహి. అయితే ఇప్పుడుండు ప్రభుత్వ విధానమును, పద్ధతిని, పరిస్థితులను గురించి నేను ఆక్షేపించువాడనైయున్నాను. నాపీక్షాయతులను వినువారు విచారించువారు లేకున్నచో దిక్కు లేనివాడనై గట్టిగా రంతు చేయుదును. దీనికై నన్ను తలతిరిగినవాడనిన్ని ద్రోహిఅనిన్ని వర్ణించినచో నేను అట్టివాడనే అగుదునుగాక.

హిందువు లెప్పుడైనా రంతులు పెట్టిన, సంచలనముచూపిన వెంటనే రెండవ సంఘమువారిట్లని ప్రచారము చేయుదురు. వ్యవసాయములు, పట్టేదారులు, జమీందారులు సాహుకారులు— అందరును హిందువులే. వర్తకదారులను హిందువులే. కావున హిందువుల ఆరోపణలు నిరాధారములు, దుర్బుద్ధి యుక్తములనైయున్నవి అని యందురు. ప్రపంచములో పైసదనం ఉన్నంతమాత్రంలో చాలదు. దానికన్న మించినది గౌరవముపదవి అనునవి యున్నవి. అటుకాకున్నచో యహూదీలవద్ద అపారధనమున్నది, కాని నేను యహూదీ జీవనము గడపుటకుకోరను. నాకు సమానమైన హక్కులు, పౌరత్వముకావలెనని మరొకమారు స్పష్టపరుచుచున్నాను. ప్రజాపరిపాలనము మాకు వద్దుఅనువారు ఏవిధముగా తమసంఘాన్ని బలపరుచుకొనుటలో స్వతంత్రతకలవారైయున్నారో ఆదేవిధముగా ప్రజాపాలనకోరువారును సంఘీభవించి ప్రచారము చేసుకొనుటకు హక్కుకలవారైయుండవలెను. ఎచ్చటనైతే ఒకసంఘానికి సైన్యపద్ధతిపై ఏర్పాట్లుచేసుకొనుటకును యుద్ధసేనవలె పరేడ్ చేసుకొనుటకును స్వాతంత్ర్యమున్నదో అచ్చట రెండవసంఘమువారికి శాంతియుక్తమైన ఊరేగింపులు, ఉత్సవాలు మాత్రమైనా చేసుకొనుటకైనా సెలవుదొరకరాదా?

బాధ్యతాయుత ప్రభుత్వమంటేహిందూరాజ్యమని [illegible] బ్రాహ్మణరాజ్యముకాకూడదా? ఈ అభిప్రాయమే నాస్నేహితునిదైనచో హైదరాబాదులో నిప్పుడుండు వివాదము కొద్దిమందిదో యియున్నది. ఎందుకన బ్రాహ్మలు నూటికిద్దరైనాలేరు: మరివారు బలహీనులు. దరిద్రులునైయున్నారు.

పండితనెహ్రూ అభిప్రాయాన్ని ఖండించుటకై యెంతశక్తి వ్యయమగుచున్నదో అందులో పదోభాగము బిదరులో నష్టపడినవారి విషయమై సానుభూతిచూపుటలో ఖర్చుఅయినట్లయిన యెంతబాగుండేది? అట్లుండియుండిన స్నేహితులకింత శ్రమ అవసరమే లేకుండెడిది, మనముస్నూ ఈవివాదములో పడకుంటిమి. ప్రతిపటానికి రెండుదిక్కులుండును-ఒకటి తెలుతురుదిక్కు- రెండవది చీకటిదిక్కు. చీకటినికప్పిపుచ్చుటకు తెలుతురుదిక్కును చూపించినచాలదు. ఇదేవిధముగా తెలుతురుదిక్కు చూపించినంతనే బిదరు ఘోరముయొక్క ప్రాముఖ్యత తక్కువకానేరదు-

నా మరికొందరు స్నేహితులు కాంగ్రెసువారిని "మహాసభవాయాలను" పదభిప్రాయ మియ్యచున్నారు- అట్లియ్యకుంటేమిాది (౭ద్నియ్యత్) దుర్బుద్ధిఅనిమేమంటాము అని బెదిరించివారు- కాంగ్రెసువారిక్కడ యెక్కడున్నారో యేమో నిషిద్ధమైనసంఘము ఎట్లైమాట్లాడును-ఏదిగొట్లున్నా ఎవ్వరునఒప్పుకొనకట్టిన్ని, స్వాతంత్ర్యము లేనట్టిన్ని, పరిపాలితులైనట్టిన్ని, ఉన్న సంఘముతో ఉన్నంతచెప్పండయ్యాఅని అనుగుటకంటే అంగీకారముపొందినట్టిన్నీ స్వతంత్రులైనట్టిన్నీ యున్నజనులు ఈపనిని చేసి తమసద్బుద్ధిని తెల్లడిరుచుకొందురుకాక- కావున సత్య మెంతవరకున్నదో మీరేచెప్పండయ్యాఅని నేను యీస్నేహితులనే విచారించుచున్నాను. మరిబిదరులోని కష్టపడినవారు నాయీస్నేహితులసానుభూతికి అర్హులుకారాఅని విచారించుచున్నాను. వారు తప్పకుండా సానుభూతినిచూపి కమిషను స్థాపించుటకై కోరుదురని నమ్ముచున్నాను.

కానున్న జాగీర్దారుల సభలో వారి రైతులకుకూడ అవకాశమిత్తురట. ఇదెట్లుండంటే తోడేలు ఎదుట మేకపిల్ల తన యిబ్బందులను తెలుపుకొన్నట్లుండును. జాగీర్దారులు దర్జాతో సభలో కూర్చునియుండగా గొంగళ్లతోను, గోచులతోను వారి యెడ్లరైతులువచ్చి వారి ముల్కీ అపభ్రంశపు వెర్రి మొర్రి యర మొర బాసలతో యేమి చెప్పుకోగలరు. వారి ప్రతినిధులకైనను ధైర్యముండునా? అయినా జాగీర్లలోనిప్రజలు ఇప్పుడైనా ఒక సంఘముగా ఏర్పడగలరు. ఈ జాగీర్దార్లసభలో వారి కవకాశమిచ్చిన తృణోప తృణములుగా సభ నలంకరింపగలరు. తమ యిబ్బందుల నిర్భయముగా వెలిబుచ్చగలరని కోరుచున్నాము. ఈ యవకాశాన్నైన పురస్కరించుకొని జాగీరు ప్రజలు తమ సంస్థను ఏర్పాటుచేసుకొనకున్న వారికిక నిష్కృతియుండదు. మేము పద్ధిమాగుల జాగీరు ప్రజలకు , సొచ్చరించి వినుగు చెందినాము. ఇక యీ విషయాన్ని గురించి చర్చించిన వృథా పరిశ్రమయగును.

## ఆయుర్వేద విద్యార్థుల పరీక్షా ఫలితము

హైదరాబాదు(దక్కన్), తీరు నా శ్రీనిజాం ఆయుర్వేదవిద్యాపీఠము వేగంబజారు హైదరాబాద్. ఏ. విద్యార్థుల ప్రథమ ద్వితీయ సంవత్సరపరీక్షలు ౧౫ఖుర్దాదు మొదలు ౨౩ ఖుర్దాదువరకుజరిగినవి. అందులో ఉత్తీర్ణులపేర్లు తెలుపబడినవి,

ప్రథమసంవత్సరము

౧. మాణిక్యరావుపశుపతే ౨. పి.ఉమామహేశ్వరయ్య. ౩: సారంగబాల్ రావు (కొల్లాపురం) ౪. పి. నారాయణ, ౫. యమ్. సంగయ్య, ౬. చెన్న జ్ఞానోభా.

ద్వితీయసంవత్సరము

౧, ఎ. నర్సింహరాజు ౨, వి.యం. వెంకటరాజు, ౩. జి. శ్రీరాములు, ౪. వెంకబాలయ్య. ౫, వ్యాస్మాణశర్మ.

పాఠశాల తరగతులు తీర్ నెలఆఖరువరకు ఇవ్వబడినవి. అమర్దాదుగవతేదికి తెరువబడును. యీ పాఠశాలలో చేరు విద్యార్థులు అమర్దాదు ఆఖరు వరకు చేర్చుకోబడుదురు.

నివరములకు హకీం నారాయణదాసు, వైద్యవిశారద్య. వేగంబజారు, "హైదరాబాదు" కు వ్రాసుకొనవలెను.

## హైదరాబాదు బజారు ధరలు

తేది ౧౦-౮-౪౯ ఫ.

పల్లా ౧కి ౧౨౦ సేర్లతూకము నకెళ్లన్ని వారీకే.

| బియ్యము | పల్లా ౧కి ధర | | |
|---|---|---|---|
| | రూ | అ | పై |
| కిచిడీసాంబర్లు | ౨౧ నుంచి | | |
| | ౨౩ వరకు | | |
| నంబర్లు | ౨౨ | ౬ | ౦ |
| ఢిల్లీభోగాలు | ౨౦ | ౯ | ౯ |
| రాంసాగర్లు | ౧౫ | ౬ | ౯ |
| నావక్రోం | ౨౦ | ౪ | ౯ |
| ఆర్కాటి | ౨౦ | ౯ | ౯ |
| కోనామణి | ౧౫ | ౬ | ౦ |
| బుడుములు | ౧౭ | ౬ | ౦ |
| దేశావరి | ౧౭ | ౪ | ౯ |
| గోధుములు | | | |
| బన్సీ | ౧౫ | ౧౨ | ౦ |
| లక్కడీ | ౧౫ | ౬ | ౦ |
| పోటియా | ౧౮ | ౦ | ౦ |
| ఎరగోధుములు | ౧౫ | ౯ | ౯ |
| జొన్నలు | | | |
| తెల్లజొన్నలు | ౧౦ | ౧౨ | ౦ |
| పచ్చజొన్నలు | ౮ | ౬ | ౦ |
| మడికట్టుజొన్నలు | ౮ | ౦ | ౯ |
| శెనగలు | ౧౪ | ౬ | ౦ |
| కందులు | ౧౦-౧౨-౦ నుంచి | | |
| | ౧౨-౧౨-౮ వరకు | | |
| మినుములు | ౧౭ | ౬ | ౯ |
| అంకలు | ౧౨ | ౧౨ | ౦ |
| సజ్జలు | ౧౦ | ౬ | ౯ |
| కుసుమలు | ౬ | ౦ | ౯ |
| పప్పు | | | |
| శెనగపప్పు | ౧౬ | ౪ | ౦ |
| కంది " | ౧౬ | ౬ | ౦ |
| కిరిశెనగ " | ౨౨ | ౦ | ౦ |
| లంక " | ౧౫ | ౪ | ౦ |
| మినప " | ౨౪ | ౬ | ౦ |
| పెసర " | ౨౨ నుంచి | | |
| | ౨౪ వరకు | | |
| బెల్లము | ౧౬ | ౬ | ౦ |
| ఉప్పు | ౧౩ | ౦ | ౦ |
| ఉల్లిగడ్డ | ౧ | ౧౫ | ౦ |
| మిరపకాయలు | ౨౫ నుంచి ౩౦ వరకు | | |
| చక్కెర మణుము (౪౦ సే) | | | |
| జావా " " | ౧౫ | ౧౨ | ౦ |
| బొంబాయి " " | ౧౫ | ౩ | ౦ |
| మద్రాసు " " | ౧౫ | ౪ | ౦ |
| నిజామాబాదు " " | ౧౫ | ౪ | ౦ |
| ఎరచక్కెర "(౧౨సే) | ౩ | ౦ | ౦ |
| దర్గాదక్కెర "(౪౦ సే) | ౧౬ | ౬ | ౦ |
| ఎల్లిగడ్డ "౧౨సే | ౨ | ౧౦ | ౦ |
| అల్లం " " | ౨ | ౧౨ | ౦ |
| నూనె మణుము ౧౨ సే | | | |
| కొబ్బరినూనె | ౪ | ౧౪ | ౦ |
| కుసుమనూనె " | ౩ | ౧౪ | ౦ |
| నువ్వులనూనె " | ౩ | ౧౨ | ౦ |
| వేరుశెనగనూనె " | ౩ | ౬ | ౦ |
| పుంటినూనె " | | | |
| కిరోసిన్ (గ్యాస్)" డబ్బా ౧కి | | | |
| తెల్లది " | ౪ | ౩ | ౦ |
| పచ్చది " | ౩ | ౯ | ౦ |
| నెయ్యి మణుము ౪౦ సే | | | |
| బిదరునెయ్యి " " | ౪౫ | ౦ | ౦ |
| తెలంగానా " " | ౪౦ | ౦ | ౦ |
| వనస్పతి డబ్బా ౧కి౧౧ | | ౨ | ౦ |
| బంగారు తు ౧కి | ౫౦ | ౧౨ | ౦ |
| వెండి ౧౦౦ తు | ౬౯ | ౪ | ౦ |
| తు ౧కి | ౦ | ౧౦ | ౯ |
| పవరక్ ౧కి కల్దారు రూ | ౨౬ | ౪ | ౦ |
| మారకం | | | |
| హాలీక కల్దారు | ౧౬ | ౧౨ | ౦ |
| కల్దారుకు హాలీలు | ౧౬ | ౧౦ | ౦ |
| ఆముదాలు బస్తా | ౧౪ | ౯ | ౦ |
| వేరుశెనగ | | | |
| బుడ్డలు మణుము | | | |
| పప్పు పల్లాకి | ౧౫ | ౯ | ౦ |

గమనిక: —

౧. ధరలు వీలైనంతవరకు సరియైనవిగా తెలుపుచుందుము. అయినను ఏమైనపొరపాట్లుండిన దానికి పత్రికావారుబాధ్యులుకాజాలరు.

౨. నగరాలలో జిల్లాలలో వ్యాపారపుపేటాలలోని గొప్పవర్తకులు తమతమకొనములు ప్రకటనలు మాపత్రికలో వేసికొనినచో వ్యా[illegible] మంచి పరిణామము కలుగును.

సంవత్సరమునకు చందా
౬ హాలీ రూపాయిలు
ఆరుమాసాలకు
౩ రూపాయిలు
బ్రిటిష్ఇండియాలో
సాలుచందా
౫-౮-౦ కల్దారు
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

The only Popular Paper that reaches The masses In the Dominions

Best Medium for Advertisement

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

**Volume 15** | **Hyderabad-Dn.** | **Thursday 16 May 1940** | **Number 4**


## భారతదేశ రక్షణ నియమావళిక్రింద కఠినచర్యలు

భారతదేశ రక్షణ నియమాలక్రింద దేశీయ ప్రజలలో ప్రబోధము కల్గించుచుండువారలు ఒకరొకరుగా జైళ్లలో త్రోయబడుచునేయున్నారు—

రామనాడ్ జిల్లా కలెక్టరు మధురపోషలిస్టు పార్టీ కార్యదర్శియగు సుబ్బయ్యగారిని యుద్ధ ప్రతికూల ఉపన్యాసాలను చేయవలదని హెచ్చరిక గావించినారు, ఇటీవలనే భారతదేశమునకు వచ్చి అహమదాబాదుమిల్లు కాంగరేయూనియన్‌తో సంబంధమేర్పరచుకొనిన తూర్పుఆఫ్రికా ట్రేడుయూనియన్ కార్యదర్శి సర్దార్ మఖన్‌సింగ్‌గారు మే౫వతేదినాటి సాయంకాలము అరెస్టుచేయబడిరి, బెంగాలురాష్ట్రములో ఢక్కా—జిల్లా ఫార్వర్డుబ్లాకు సహాయ కార్యదర్శి మృత్యుంజయరాయ్‌గారు తనయిల్లు—దలి కదలరాదనియు, వారమునకొకసారి పోలీసుస్టేషనులో కనపడిపోవుచుండవలెననియు నిర్బంధాజ్ఞ జేసగబడెను బెంగాలురాష్ట్రమందుశచీంద్రనాథసేనుగారు రచించిన "పొదర్ దాబి"అనుపేరుగల నాటకము ప్రభుత్వమువారిచే నిషేధింపబడినది. యుద్ధప్రతికూలోపన్యాపముచేసినాడనుకారణముచే పండిత్ లక్ష్మీనారాయణ మిశ్రఅను కాంగ్రెసునాయకునికి ఒకఏడు కఠినశిక్షవేయబడినది బెంగాలురాష్ట్రమందు ఇదివరలో డిటెనుగానుండిన రోహిణీ భట్టాచార్యగారికి ఒకఏడు కఠినఖైదుశిక్ష విధించబడినది సింధురాష్ట్రంలో "సామ్రాజ్యయుద్ధము" "నుస్....ను ....క రష్యావారి అపార.... కర్యములు"అనురెండు ....పత్రముల ప్రతులన్నిటిని ప్రభుత్వమువా....ప్తుచేసినారు మాల్టాజిల్లా ఫార్వర్డుబ్లాకుకార్యదర్శియగు ధేందుర్ఘూ, ఆనేజిల్లాలోనిఒకకిసాన్ నాయకుడు ౧౦౦ రూపాయిల జూర్మానా చెల్లించుటకు లేదా ౬నెలల ఖైదు అనుభవించుటకు ఆజ్ఞగావించబడినది వీరలు అధికారుల అనుమతిలేనిదియే సభజరిపినారు ఢక్కా—లో ఆనందలాల్,మరి ఇద్దరు, ప్రమోదనంది ప్రఫుల్ల చక్రవర్తి గారలు అధికారుల అనుమతిలేకుండ కాంగ్రెసువర్కర్ల సమావేశము జరిపినందుకై అరెస్టుచేయబడిరి హుగ్లీజిల్లా మేజస్ట్రేటుగారుహిందూసభ కార్యదర్శియగు సరజుప్రసాద్ హాలాఫ్ గారిని శాసనవ్యతిరేకమైనఏని వేయరాదని హెచ్చరించినారు

## తిరువాన్కూరు సంస్థాన కాంగ్రెసు అధ్యక్షుని అరెస్టు

తిరువాన్కూరు సంస్థాన కాంగ్రెసు అధ్యక్షుడగు ఏ జోసఫ్‌గారు మే౬వతేదినాడు కొట్టంకులంగారా దేవాలయు మైదానమువద్ద ౯మంది వాలంటీర్లతోకలసి సత్యాగ్రహ యత్నించుచుండగా అరెస్టుచేయబడిరి ఏఅచ్యుతన్‌గారు ౧౨వ అధ్యక్షుడుగ నియమించబడినారు

## రాజకోటలో సంయుక్త నియోజక ప్రచారము

క్రొత్తగా రాజకోట సంస్థానమునకు దివాను అయిన యన్ యన్ అంగ్లెసారియాగారు ౭ మేరావ తేదీనాడు ఫైసిల్ విందులో హాజీదాదాగారు ప్రత్యేక నియోజక పద్ధతి కావలెనని కోరిరి అందుకు దివానుగారు ముసల్మానులకు రక్షణల

## యాద్గీరులో అల్లరి

రైలులో వార్త

ఒక విలేఖరి మాకిట్లు వ్రాయుచున్నాడు -

"అయ్యా, నేను ౧౧మేనాడు గద్వాలనుండి రైలులో వెళ్లుచుండగా నేనెక్కిన రైలు డబ్బాలో జనులిట్లు మాట్లాడుకొనుచు గుల్బర్గాసూబాలోని రాయచూరుజిల్లాలోని యాద్గీరులో కొందరుశైవులు బసవేశ్వరుని ఉత్సవమును ఊరేగింపుచేయుచుండగా వారికి ముసల్మానులకును కొట్లాట జరిగెను

చాలామందికి గాయాలుతగిలినవి కొందరు చాల ప్రమాదస్థితిలో ఉన్నారు"అని మాట్లాడుకొనుచుండిరి ఈనాటివరకు మేగెరె సాయంత్రంవరకును నేను వివరాలు తెలుసుకుందామని అనుకొంటిని, కాని ఏపత్రికలోను దానివివరాలు తెలియకపోయెను కావున నేను విన్నంతవ్రాసుకొన్నాను మీకేమైనా విశేషాలు తెలిసిన పాఠకులకు వెంటనే తెలుపుదురుగాక"

(మాకేమియు తెలియదు గో ప)

మరికొన్ని విశేషాలు

౧౪ మేనాటి హైదరాబాదు బులెటిన్‌పత్రికలోఇట్లు వ్రాసినారు —

యాదగీరులో బసవజయంతి సందర్భములో జరిగిన కొట్లాటనుగురించి మరికొన్ని విశేషాలు తెలియవచ్చినవి అవేవనగా— ఎప్పటివలె నేడూరేగింపుతో ౯ మేనాడు బసవజయంతి యాదగిరిలో జేయబడెను అది వాలబోగివసతుండి సాయంత్రము ౬ గంటలకు.... బస్సిలాల్ హోటలుముందు....చ్చెను. అప్పుడు ఊరేగింపులోనివాని సెటివినికొట్టిరి ఇతరులుయీఅల్లరిలోచేరిరి క్రమముగా గొప్పఅల్లరిక్రింద పరిణమించెను ఇంతలో ౨౦ గాయితులు తమపల్లకీని బోలీసుస్టేషనుముందర వదలిపెట్టివెళ్ళిపోయిరి చాలా మందికి దెబ్బలుతగిలినవి రెండుఇండ్లను, ఒకహోటలును లూటీచేయబడెను

మరుసటిదినమునాడు ౧౪౪ సూత్రముప్రయోగింపబడెను తాలూక్దారున్ను, పోలీసు అధికారిన్ని ఇతరఅధికారులును రణరంగాన్ని తిలకించివెళ్ళిపోయిరి

## వఖ్తుపత్రిక వెల్లి వెళ్లినది

హైదరాబాదు (దక్కన్), తేది ౯ గతసంవత్సరము ఫర్మానుద్వారా నిషేధింపబడి ఆపివేయబడిన"వఖ్తు" అను స్థానిక ఉర్దూదినపత్రిక ౧౪మేనుండి బయలుదేరుచున్నది

## రైలులో అరబ్బు దుండగాలు

డోర్నకల్లుస్టేషనులో ఒకఅరబ్బు (కడబ్బా లోకూర్చుని లోపలిక ఎవ్వరినిరానీయలేదు ఒక పోలీసుజమేదారు అందులోనెక్కపోయెను, అతనికని ఆదేశాక్షేపణజరిగెను జమేదారువినలేదు అందుపై అరబ్బు జంబియానుబయటకిలాగి ముగ్గురు మనుష్యులను పొడిచినాడు డోర్నకల్ రైల్వేపోలీసువారు విచారణచేయుచున్నారట

యేర్పాటుతో సంయుక్త నియోజకవర్గ పద్ధతివల్ల హిందూ ముసల్మానుల పరస్పరానుమానములు తొలగగలవనియు, తనకు ప్రత్యేక నియోజకవర్గ పద్ధతి యిష్టముకాదనియు, చెప్పి త్వరలో ప్రజాసభను సమావేశపరచి ప్రజాప్రతినిధులకు పరిపాలలో బాధ్యత నీయగల్గుదునుగాకయని ఆశించిరి

## శ్రీ బసవ జయంతి ఉత్సవము

ఆర్యసమాజము సాధించలేనిదానిని బసవేశ్వరుడు సాధించినాడు

వీరశైవబోర్డింగు (లింగంపల్లి) యందు శ్రీబసవేశ్వర జయంత్యుత్సవసందర్భమున తేదిః ౭ మే ౧౩౪౯ ఫసలీకిసరియగు విక్రమనామసంవత్సర వైశాఖశు॥౨ గురువారమునాడు సాయంత్రము ౫ గంటలకు సుప్రసిద్ధన్యాయవాదులగు పండితశ్రీనివాసరావుగారి యధ్యక్షతలో ఒకసభ సమావేశపరుపబడెను—

కలిగణనాథగారు కన్నడభాషయందు శ్రీబసవేశ్వరుని జీవనచరిత్రనుదుపుచు వీరశైవ మతోద్ధరణకై వారుచేసినసేవను చక్కగా వర్ణించిరి

శ్రీబసవేశ్వరులవారు హిందువులలోగలయజ్ఞయాగాది హింసాత్మకముగు క్రతువులు, ఉచ్చనీచభేదములకల్పించు వర్ణవ్యవస్థ, అగ్రజాతివారు పంచములను కడునీచముగాజూచుట, మొదలగుసంఘ దురాచారములను సుమారు యెనిమిదివందల సంవత్సరములకుపూర్వమే రూపుమాపుటకై ప్రయత్నించిరనియు, బ్రాహ్మణులుమొదలగు అగ్రజాతులవారు నీచజాతివారిపైన పరిపూర్ణ అసూయాభావముగలవారై వారిని సంస్కృత విద్యాభ్యాసము చేయనియ్యకుండుటమాని శ్రీబసవేశ్వరులవారు కన్నడభాష....తమవచనములద్వారా వేదాదిసంస్కృతగ్రంథముల సారమును బోధించి సామాన్యజనులందరికిని విద్యావంతులగుట కవకాశమొసంగుటయేకాక కన్నడసాహిత్యమునకు మహోపకారమొనర్చిరనియు ప్రస్తుతము హిందూస్థానమునందు మహా జనాదరణమొందిన హరిజనసమస్య మరియు వర్ణవ్యవస్థ మొదలగు విషయములను, యింతకుపూర్వమే శ్రీబసవేశ్వరులవారు లేవదీసి తనవచనములద్వార ఉచ్చనీచభేదములుంచకూడదని బోధించుటయేకాక స్వయముగా తాను శివభక్తిగల అన్యజాతివారల కందరికిని శివదీక్షయొసగి వారితోసహ పంక్తియొనర్చుటయేకాక తనభక్తమండలిలో చేరినవారికి వర్ణభేదములేకయే పరస్పరవివాహములు జరిపించుచుండిరనినుడువుచు తమ ఉపన్యాసమును విరమించిరి—

అనంతరము శ్రీమాన్ ప్రభురావు హైకోర్టు వకీలుగారు (ఉర్దూ)హిందీభాషయందు శ్రీబసవేశ్వరులవారి చరిత్రనుదువుచు వర్ణభేదములను బోనార్చుటకై శ్రీబసవేశ్వరులవారుచేసిన ప్రయత్నములనునుడివిరి—మరియు జాతిభేదములను బోనార్చి సర్వసమానత్వముమస్థాపించుటలో శ్రీబసవేశ్వరులవారికికలిగినవిజయము ప్రస్తుత ఆర్యసమాజీయులకుగూడ కలుగలేదనినుడివిరి—ఆర్యసమాజస్థాపనయందు స్వామిదయానందులవారిముఖ్యోద్దేశ్యమునందు పరిపూర్ణవిజయము కలుగలేదనియు, అందుకనియే పంజాబుదేశమునందు "జాతపాత్‌తోడక్" మండలి"యను పేరుతో ప్రత్యేక సంస్థ యేర్పాటుచేయు అవసరము కలిగినదనియు ఉపన్యాసములు నుడివిరి—

తరువాత అధ్యక్షులవారు తమగంభీరోపన్యాసమొసగుచు ఇట్టిమహాపురుషుల జన్మదినోత్సవమునాడు సభ జరిపి ఉపన్యాసములొసగి యెవరింటికివారుపోవుటచే కృతకృత్యులమైనామని తలచకూడదనియు అట్టిమహాపురుషుల ఉద్దేశ్యములు .... శ్రీబసవేశ్వరులు మొదలిడిన వీరశైవసంఘట ..... యెన్నటికిని .... ప్రతిజ్ఞచేసి అట్టిమహాకార్యమును సఫలీకృత మొనర్చుట మనసరము కర్తవ్యమనియు నుడివిరి—

అనంతరము సభవారందరికి కృతజ్ఞత తెలిపి సభ ముగింపబడెను—

ఇట్లు

మరిం వీరయ్య

సెక్రటరీ వీరశైవసమాజము

హైదరాబాదు- దక్కన్

## నిజాంరాష్ట్రఆంధ్రమహాసభ స్థాయిసంఘ ప్రకటన

హైదరాబాదు (దక్కన్) తేది ౧౦ స్థానికులును, జిల్లాలనుండి వచ్చువారును, ఈ క్రింది సమయములందు కార్యాలయమునకు దయచేసి, కార్యదర్శులతోగాని, అధ్యక్షులగారితోగాని సంప్రదించి తమ తమ అవసరములను తీర్చుకొనగలరు

అందరి అనుకూలమును, సౌకర్యమును అనుసరించి కార్యాలయము ప్రతిదినము రెండుమారులు అనగా ఉదయమును సాయంత్రమును తెరచి యుంచబడును

వివరములు —

ఉదయము ౭ నుండి ౯ వరకు

సాయంత్రము ౪ నుండి ౬ వరకు

కార్యాలయస్థానము కొత్త మార్కెట్ నవద్ద సుల్తాన్‌బజారు హైదరాబాదు

చిర్కోల్పల్లి రామచంద్రరావు

వెల్దుర్తి మాణిక్యారావు

## మసీదులముందు వాద్యములు

ఖురానులో చెప్పినమాట

ఆల్వాయిలో ప్రవక్త దినోత్సవము జరిగిన సందర్భమున తిరువాన్కూరు పోలీసు యిన్‌స్పెక్టర్ జనరల్ ఖాను బహద్దర్ అబ్దుల్ కరీము సహెబ్‌గారు యిట్లు ఉపన్యసించినారు

"మసీదులలో ప్రార్థనలు చేయు సమయమునందు వాయిద్యాలు ....కూడదని ఖురాను ....లో ఎచ్చోటను చెప్పలేదు. ....తో కూడిన ...., బయట ఎంత గట్టిగా వాయిద్యాలు జరుగుచున్నను మనస్సు చలించకుండా ఏకాగ్రతతో ప్రార్థన చేయుటయే నిజమైన ప్రార్థన కావున ప్రార్థనచేయు నప్పుడు మసీదుల ఎదుట వాయిద్యాలు జరుగుచున్న పుడు వాటిని ఆపు చెయ్యడానికి మహమ్మదీయులకు నిమిత్తములేదు

ప్రార్థనలు జరిపే ....తో ఐక్యమైపోయేటంత ..... సంగీతము చేయుచున్నద ఢిల్లీ, అజ్మీరులో ప్రతి లక్ష్మీ... యిటువంటి ప్రార్థనలు జరుగుచుండును ప్రార్థనలుచేసే అప్పుడు ఇస్లాములో కొన్ని పద్ధతుల (చిష్టి సూఫీగారి మొదలయిన) సంగీతవాద్యాలు చెయ్యడము అవసరము

మసీదులముందు వాయిద్యాలు ఆటంకముచేయడము గోవధను ..... ముస్లిముల ఐకమత్యమునకు .... మసీదులముందర వాయిద్యాలు చేయకూడదని మహమ్మదీయులు .... చూపవలసిన కోటాటలు జరుగుచున్నవి కాని మహమ్మదీయులు ..... హిందువులు ... తామే మసీదులను వాయిద్యాల... మారిపేయుదు మహమ్మదుప్రవక్త ఆహార విషయములో మేక, గొర్రె, ఒంటె, ఆవు మాంసాన్ని సూచించినారు, వీటిమాంసాలన్నిటను తినతీరవలెనని విధియుయలేదు ఇండియాలోని ముసల్మానులు ఎంతోమంది ఒంటెమాంసాన్ని భక్షించినారా అటువంటప్పుడు ఆవు మాంసాన్నే తినతీరవలెనని పట్టింపు వారికెందుకు ఉండవలెను? ఆవు ఇండియాలో ... ఉపయోగకరమైన జంతువు, అప్రపాలు పిల్లలు త్రాగుట లేదా? ..... సహాయమునిచ్చే మైన ఆవును చంపడమెందుకు! కావున మహమ్మదీయులు ఈరెండు విషయములను గుర్తించి తమయాందోనమ్మకమును తొలగించి..... హిందువులతో సామరస్యంగాజీవించుటకు అవకాశము కలుగును

## బిదరును వదలుకొనుట

"వారము పదిదినాలనుండి బీదరులోని సాహుకార్లు, నిధులు అయినహిందువులు తమయిండ్లను వదలి వేరే చోటనివాసముచేయుటకై వెళ్ళిపోవుచున్నారు కారణమేమిఅనివిచారించగా మాకిచ్చట ప్రాణ ధన సంరక్షణజరుగుటలేదు. అని అన్నారట ఎవ్వరో రహస్యముగా అమాజాస్యవరకు హిందువులుబీదరుపట్టణాన్నివదలి వెళ్ళిపోవలసినదని ఎవ్వరికో ఒకవకీలుకు వ్రాసినారు. ధనికులైనవారే ఎక్కువగాఖాళీచేయుచున్నారు. వారిట్లుచేయుటవలన ఇతరజనులలోను బీదజనులలోను తలపటాయింపు వ్యాపించిపోయినది."

(ఆజంన్యూసు)

### శ్రీ కృష్ణదేవరాయాంధ్రభాషా నిలయములో స్మారకసభ

హైదరాబాదు (దక్కన్)

౧౭-౫-౪౦ శుక్రవారమునాడు సాయంత్రము ౬-౩౦ గంటలకు భాషానిలయనిర్మాతలలో నొకరును, సుప్రసిద్ధసంఘ సేవాపరాయణులునగు స్వర్గీయ బ్రహ్మశ్రీ ఆదిపూడి సోమనాథరావుగారి మరణమునకై విచారము సూచించుటకు సభసమావేశపరుపబడును అందరు సకాలమునకువచ్చి స్వర్గీయులయెడ గౌరవముచూపుదురని ప్రార్థన

కస్తూరి కిషన్‌రావు

స కార్యదర్శి.



లక్ష్మీకాంతారెడ్డిగారు

వనపర్తి మునిసిఫ్‌గాపనిచేయుచుండిన దాం ఏండ్ల కన్నోప్పుడుఅయిన లక్ష్మీకాంతారెడ్డిగారు ఉద్యోగాన్ని వదలుటకునుండుగా ఆరు నెలల సెలవును తీసుకొని ఇప్పుడు హైదరాబాదునగరములోనున్నారు

## కాశ్మీర సంస్థానానికి సంయుక్తనియోజకవర్గ పద్ధతి

కాశ్మీర సంస్థానమందు స్థానిక స్వపరిపాలన సంస్థలలోఅవసరమైన సంస్కరణలను సూచించుటకై ప్రభుత్వముచే కోరబడిన ఉపసంఘమువారు ఇప్పుడున్న ప్రత్యేక నియోజక పద్ధతిని (అనగా ఏ తెగవారు ప్రతినిధులను కేవలము ఆ తెగవారే ఎన్నుకొను పద్ధతిని) తీసివేసి సంయుక్త నియోజక వర్గపద్ధతిని యేర్పాటు చేయవలసినదనియు కాని కొన్ని నిర్ధారిత స్థానములను ఆయా తెగలకు ప్రత్యేకించి యుంచవలెననియు, సూచించినారు ఎన్నికలచేవచ్చేడిప్రతినిధులసంఖ్యను హెచ్చించవలసినదనియుసూచించినారు.


Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad Dn, Editor S Prathapa Reddy, B.A B.L